ఓమ్ నమశ్శివాయ

# ద్వాదశ జ్యోతిర్లింగములు

శ్రీ భగవత్పాదులు శంకరాచార్యుల వారి స్తోత్రమునకు ఆంధ్రానువాదము, ప్రతి శ్లోకమునకు పద్యతాత్పర్యములతో పాటు ఆయా క్షేత్ర మహిమలు, క్షేత్రకథలును కలవు.

A CC No - 21668



రచయిత

కవిశేఖర కొండేపూడి సుబ్బారావు

ప్రసన్న భారతీ గ్రంథమాల

ముద్రణ : ప్రథమ ముద్రణ. 1994

ప్రతులు : 1,000

A CC No - 21668

వెల రూ॥ 10-00 లు.

294.535
SUB

ప్రాప్తిస్థానము

శ్రీ కొండేపూడి సుబ్బారావు
47-10-5, ద్వారకానగర్
విశాఖపట్నం - 530 016.

ముద్రణ :

లలితా ఆర్టుప్రెస్
విశాఖపట్నం-1.

# కృతజ్ఞత



This book is published with the financial
Assistance of
**SRI TIRUMALA TIRUPATI DEVASTHANAMS**
Under their scheme Aid to publish Religious Books.

ఏవిభు కృపచే నీకృతి
కావిష్కృతి భాగ్యమబ్బె నాకరుణాళున్
శ్రీవేంకటగిరి నాథుని
భావంబున నిల్పి కొలుతు భక్తిదలిర్పన్

ఈ గ్రంథము
శ్రీ శ్రీ శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారి
ద్రవ్య సహాయమున ముద్రితము.
వారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతాభివందనములు

# విషయ సూచిక

## ద్వాదశ జ్యోతిర్లింగములు

పుటలు :

# ద్వాదశ జ్యోతిర్లింగములు

## భూ మి క

శ్రీ రమణీయమైన భరతవర్షము వివిధ ప్రకృతి సంపదలతో విరాజిల్లు సంపన్న దేశమే కాక సనాతన వైదిక ధర్మ కర్మములకు నిలయమైన పుణ్యభూమియని కూడ పేరు కీర్తులు గనిన గొప్ప దేశము. తదనుగుణముగ ఈ భరతవర్షము నందెన్నియో శివ విష్ణువుల ఆలయములు నిత్యపూజోత్సవములతో విలసిల్లుచున్నవి. నామములే వేఱుగాని శివుడు విష్ణువు సర్వవిశ్వమున కాధారమైన పరమాత్మ స్వరూపములే. సర్వశక్తి, సర్వాత్మకుడు నిరాకారుడు, సర్వాంతర్యామి, యైన పరమాత్మను మన ప్రాచీన ఋషులు వారి తపోధ్యాన శక్తులచే వివిధ నామములలో వివిధ రూపములలో దర్శించి, ఆ పరమాత్మను స్థూల సూక్ష్మాకారములలో అర్చించు విద్యను మన కొసగిరి.

నిరాకారుడైన పరమాత్మను ధ్యాన మనన సమాధి స్థితులలో దర్శించి జన్మసాఫల్యప్రదమగు దివ్యానంద మనుభవించుట ఆత్మ జ్ఞానులకే సాధ్యము. దివ్యానందమే పరమ పదమనబడు మోక్షస్థానము. జీవికి శాశ్వతము అవ్యయము అయిన ఆనంద సౌఖ్యమది — అట్టి దివ్య జ్ఞానలబ్ధిలేని సామాన్యులకును ఐహికాముష్మిక సౌఖ్యములను మోక్ష ప్రాప్తిని కలుగజేయు దైవభక్తి మార్గము లున్నవి. సగుణ సాకారుడైన పరమాత్మను విధి విధానముగ అర్చించు నిష్ఠయే అనులభ మార్గము.

లోక కళ్యాణార్థము పరమాత్మయగు సదాశివుని తేజోమయాకారములు జ్యోతిర్లింగములు ద్వాదశ పుణ్య క్షేత్రములలో స్వయం అర్చారూపములుగ ఆవిర్భవము నందినవి. అవి

సౌరాష్ట్రే సోమనాథంచ, శ్రీశైలేమల్లికార్జునమ్.
ఉజ్జయిన్యాం మహాకాళ మోంకారే పరమేశ్వరమ్,
కేదారం హిమవత్పృష్ఠే, డాకిన్యాంభీమశంకరమ్.
వారాణస్యాంచ విశ్వేశం. త్ర్యంబకం గౌతమీతటే.
వైద్యనాథంచితాభూమౌ, నాగేశం దారుకావనే.
సేతుబంధేశ రామేశం, ఘుశ్మేశం చశివాలయే.

భక్తరక్షణ కళాపారీణుడైన పరమేశ్వరు డిట్లవతరించి భక్తులకు భుక్తిముక్తులు ప్రసాదించుచున్నాడు.

ఈ విశ్వమంతయు శివమయము. విశ్వసృష్టి పంచ భూతములతో నిండియున్నది. శివుడష్టమూర్తి పృథివి జలము అగ్ని వాయువు ఆకాశము జీవాత్మ సూర్యుడు చంద్రుడు ఈ అష్టమూర్తులను శర్వభవ రుద్రఉగ్ర భీమ పశు పతి మహాదేవ ఈశాన నామములతో శివుడధిష్ఠించి జగత్ పరిపాలన నెఱపుచున్నాడు.

తదుపరి పంచభూతాత్మకములగు శివ లింగములును ఉన్నవి. అవి కాంచీక్షేత్రమున పృథ్వీలింగము జంబుకేశ్వర మున జలలింగము అరుణాచలమున తేజోలింగము శ్రీకాళ హస్తిలో వాయులింగము చిదంబరములో ఆకాశలింగము

పరమశివుని పంచబ్రహ్మమూర్తులు, ఈశాన్య తత్పురుష అఘోర వామదేవ సద్యోజాత నామకములు.

కరుణామయుడు ఆర్త శరణ్యుడు అయిన మహాదేవుడిట్లు సర్వ ప్రపంచ పరివ్యాప్తుడు భక్తసులభుడు అయియున్నాడు పరమ శివుని పూజలు సకలాభీష్టప్రదములు సకలలోక కళ్యాణదాయకములును

ధర్మ నిలయము కర్మభూమియునగు భరత వర్షమున జన్మించినవారికి వారి పుణ్యఫలముగ ఒక మహాభాగధేయము లభించినది. ఆది వ్యాస వశిష్ఠ వాల్మీకి ఆది మహాఋషులు, శంకర రామానుజ మధ్వాచార్యాది మత ప్రవక్తలు ఇంకను ఎందరో దైవభక్తి ప్రబోధకులైన మహాత్ములీ దేశమున జన్మించుట; వారందరు మహా తపస్సిద్ధుల, జ్ఞానులు, భగవత్సమానులు — నిస్స్వార్థపరులు ప్రజాసేవకులునై లోకకళ్యాణార్థము వేదోపనిషత్ సారము లనదగు పురాణేతిహాసకావ్యము లనేకములు వ్రాసి మానవజాతి కందించిరి. నిత్యపూజా ప్రార్థనలకనువగు పెక్కు దైవస్తోత్రములను రచించిరి.

ఆ విధముగనే క్రీ॥ పూ॥509వ సం॥న దక్షిణ భారతమందు ఉద్భవించిన మహామనస్వి జగద్గురువులు శ్రీ శ్రీ శంకరాచార్యుల వారు అసంఖ్యాకములగు వేదాంత గ్రంథము లనేకాక పెక్కు దైవస్తోత్రములను రచించిరి. ఇది శ్రీ పరమశివుని మాహాత్మ్య గాథ. ఈ స్తోత్ర రాజమునకీ గ్రంథము ఆంధ్రానువాదము. ఇందు పండ్రెండు జ్యోతిర్లింగముల గాథలను వరుసగ నీయబడినవి. ప్రతి శ్లోకమునకు తెలుగున పద్య తాత్పర్యములు. అందున్న

విశేషార్థమే కాక, ఆక్షేత్ర మహిమను, ఆపరమేశ్వరుని కరుణా పరిభావము దెలుపు పూర్వగాథలును ఈయబడినవి. ఈ మహిమల వివరములు శివపురాణములోని కోటి రుద్ర సంహిత యందును. ఇతరపురాణములందును చెప్పబడినవి. ఈ పుణ్య క్షేత్ర సందర్శనము సకల పాపహారము. ఐహికాముష్మిక సౌఖ్యదాయకము. ప్రాతఃకాలమున ఈ ద్వాదశజ్యోతిర్లింగ సంస్మరణము స్తోత్రపఠనము సర్వాభీష్టప్రదము.

ఈ స్తోత్ర పఠనమున భక్తులెల్లరును శివ పూజా తత్పరులై శివధ్యాన నిష్ఠులై శివానుగ్రహ సంపన్నులై ఐహికాముష్మిక సౌఖ్యవంతులగుదురు గాక.

ఈ గ్రంథమునకు శివతత్త్వము అను పరిచయ వ్యాసమును వ్రాసి యిచ్చిన మహాపండితులు "వ్యాకరణాలంకార చక్రవర్తి" శ్రీ అప్పల్ల సోమేశ్వరశర్మ గారికి కృతజ్ఞతాభివందనములు.

గ్రంథకర్త

## ద్వాదశ జ్యోతిర్లింగములు – ఆ క్షేత్రములకు ప్రయాణ మార్గములు

1. సోమనాథ లింగము : సౌరాష్ట్రలో ( గుజరాతు ) అరేబియా సముద్ర తీరమున ఉన్నది. విజయవాడ నుండి రైలులో బొంబాయి అహమ్మదాబాదు మీదుగా వీరవల్ స్టేషను, [ సోమనాథ్ ]

2. శ్రీశైలమల్లికార్జున లింగము : విజయవాడ నుండి రైలులో గుంటూరు మీదుగా మార్కాపురం. అచ్చట నుండి బస్సు. విజయవాడ నుండి నేరుగ బస్సులును కలవు.

3. మహాకాళ లింగము : రాజస్థాన్‌లో ఉన్నది. విజయవాడ నుండి రైలు భోపాలునకు (మ. ప్ర.) అచట నుండి ఉజ్జయిని.

4. ఓంకారేశ్వర లింగము : మధ్యప్రదేశ్‌లో నర్మదా తీరమున ఉన్నది. విజయవాడ నుండి రైలులో ఇటార్సీ అచటి నుండి ఖాండ్వా కొకిర్సు జంక్షను. అచటి నుండి ఓంకారేశ్వర్ రోడ్డు మీటరు గేజుబండిలో. ఆతరువాత 25 కి.మీ. బస్సు.

5. కేదారేశ్వర లింగము : ఉత్తరప్రదేశ్ హిమాలయ పర్వతశ్రేణిలో ఉన్నది. విజయవాడనుండి రైలులో ఢిల్లీ, హరిద్వార్. అచటినుండి గౌరికుండ్ వరకు [ఋషీకేశ్ మీదుగా] బస్సు. అచటి నుండి 18 కి.మీ నడక. లేక గుఱ్ఱములు, డోలీలు దొరకును

6. భీమశంకర లింగము : మహారాష్ట్రలో ఉన్నది. విజయవాడ నుండి రైలులో బొంబాయి దారిలో ఉన్న పూనాలో దిగి అచటి నుండి 70 మైళ్ళు బస్సులో భీమానదీ తీరమున ఉన్న సహ్యాపర్వత డాకినీ శిఖరము చేరవచ్చు. ఈ లింగము అచటనున్నది.

7. కాశీవిశ్వనాథ లింగము : ఉత్తర ప్రదేశ వారణాసి నగరమున గంగా తీరమున ఉన్నది. బెజవాడ నుండి నేరుగా రైలులో వారణాసి చేరవచ్చును.

8. త్ర్యంబకేశ్వర లింగము : మహారాష్ట్రంలో నున్నది. విజయవాడ నుండి బొంబాయి పోవు రైలులో కళ్యాణి స్టేషనులో దిగి, అటునుండి మరల రైలులో నాసిక్ చేరి, 20మైళ్ళు బస్సులో పోవలెను.

| | | |
|---|---|---|
| 9. వైద్యనాథ లింగము | : | బీహారు రాష్ట్రములో గయకు సమీపమున నున్నది. విజయవాడనుండి రైలులో ఇటార్సీ, అలహాబాదు, మొగలుసరాయి మీదుగా గాని, కలకత్తా మీదుగా గాని గయ చేరవచ్చును, గయకు సమీపమున గల ఖోన్‌స్టేషను వద్ద ఈ లింగమున్నది. |
| 10. నాగనాథ లింగము | : | సౌ రాష్ట్రములో గల ద్వారకవద్ద ఉన్నది. ద్వారకనుండి ఇంచుమించు 30 కి॥ మీ బస్సు ప్రయాణము విజయవాడ నుండి బొంబాయి అహమ్మదాబాదు మీదుగా ద్వారక చేరవచ్చును. |
| 11. రామేశ్వర లింగము | : | తమిళనాడులో ఉన్నది. విజయవాడ నుండి మద్రాసు మధుర మీదుగా రైలులో రామేశ్వరము చేరవచ్చును. |
| 12. ఘుశ్మేశ్వర లింగము | : | మహారాష్ట్రములో నున్నది. విజయవాడ నుండి రైలులో హైదరాబాదు మీదుగా ఔరంగాబాదు వెళ్ళి అచ్చటినుండి బస్సులో ఎల్లోరా చేరవచ్చును. అచటి గుహల సమీపంలో ఈ లింగమున్నది. |

......

# శివతత్త్వము

"వ్యాకరణాలంకార చక్రవర్తి సాహిత్యవిశారద"
అప్పల్ల సోమేశ్వర శర్మ

"నమశ్శివాయ" – ఇది ప్రసిద్ధమైన "శివపంచాక్షరీ" మంత్రం, పరమ పవిత్రమని, పాపనాశకమని, శ్రేయోదాయకమనిన్నీ, అనూచానంగా వస్తున్న ప్రచారం ఆదరంతో జరుగుతున్న జపాచారం, భక్తహృదయ సంచారం. ఈ మంత్రానికి ముందు "ఓమ్" అని ప్రణవాన్ని చేర్చి జపం సాగిస్తారు.

త్ర్యంబకం యజామహే
సుగంధిం పుష్టివర్ధనమ్,
ఉర్వారుకమివ బంధనాత్
మృత్యోర్ముక్షీయ మామృతాత్,

సకలసంపత్ ప్రదాతయు సర్వపరిపోషకుడు, అయిన ముక్కంటిని ఎల్లప్పుడును సేవించవలెను (పూజించెదము) పండిన దోసపండు తన తొడిమనుండి సులువుగా విడిపోయిన విధంగా, అతడు మృత్యుబంధం నుండి మమ్ము విడదీసి, మాకు అమరత్వమను అనుగ్రహించుగాక ! ఇది మృత్యుంజయ మహామంత్రం. అపమృత్యువును [అకాలమరణం ఆకస్మిక మరణం) నివారించి. ఆయుర్దాయమును పెంపొందించు మంత్రరాజం. అందరున్నూ అన్నివేళలందును జపించదగిన మంత్రరత్నం.

ఈ రెండు మంత్రాలున్ను "రుద్రప్రశస్తి" అనే వేద భాగంలో విరాజిల్లు తున్నవి. రుద్రప్రశస్తినే "రుద్ర"నమకము అంటారు. ఇది కృష్ణయజుర్వేదంలోని ఒక భాగం. ఈయజుర్వేదం ఋక్‌సామముల మధ్యను (ఋక్–యజుస్–సామ) వెలుగుతున్నది. ఋక్‌సామములకు సార్థక్యం దీని వలననే సమకూరుతుంది. ఈ విధంగా శివ మంత్రములవల్ల యజుస్సుకు దానివల్ల వేదాలకున్ను వెలుగు కలుగుతున్నదని సంప్రదాయవేత్తలు వ్యాఖ్యానిస్తారు. భవతు,

వేదాలకే శిరోమణి అయిన ఈ శివుడు ఎవరు? వేదాలు ఉపనిషత్తులున్ను సాక్షాత్తుగా ప్రతిపాదించిన పరమపురుషుడే శివుడు. "తమసః పరస్తాత్" జ్యోతిర్మయుడు," పరాత్ పరః (సర్వోత్తముడు), "సత్యం పరం ధీమహి" (సత్యస్వరూపుడు), తాను దరిద్రుడై అందరకు అన్నీ ఇచ్చేత్యాగమూర్తి. సకల కళ్యాణ సంపాదకుడు. "ఉబ్బులింగడు"

సచ్చిదానందమైన నిర్గుణమైన స్వప్రకాశమైన పరతత్త్వము సోపాధికమై మొట్టమొదట, ఆదిమధ్యాంతములు లేని జ్యోతిర్లింగంగా ఆవిర్భవించిందని, శాస్త్రాలు చెపుతాయి ఆలింగమే ఉపాసనా సౌకర్యం కోసం పన్నెండు "జ్యోతిర్లింగాలు" గా, ఆయా పుణ్యక్షేత్రాలలో వెలిసిందని పురాణాలు ప్రస్తరిస్తాయి. పరమశివుని "పరంజ్యోతిః"గా ఆరాధించడమే ఇక్కడ ముఖ్యతాత్పర్యం "హిరణ్మయపురుషం" (పరమాత్మ బంగారుబొమ్మ) అని వేదాంతముల వర్ణనం. ఇదే శివతత్త్వము

ఆధ్యాత్మిక ప్రభానిరతమైన భారతంలోని పన్నెండు జ్యోతిర్లింగాలను "శంకరః శంకరః సాక్షాత్" శంకరాచార్యులు శంకరులే అనిపించుకున్న ఆది శంకరాచార్యులు స్తుతించినారు. అదే "ద్వాదశ జ్యోతిర్లింగస్తోత్రము" ఒక్కొక్క లింగమునకు ఒక్కొక్క శ్లోకము లోకానుగ్రహం కోసం ఈ పని జరిగింది. శ్రీ శంకర భగవత్పాదులు అతి విచిత్రమైన మహా పురుషుడు "ఏకమేవాఽద్వితీయమ్" (ఉన్నదొక్కటే) అని అద్వైతాన్ని ప్రతిష్ఠించేరు, అయినా "సర్వాణి రూపాణి విచిత్య ధీరః! నామాని కృత్వా (అన్నివిధములైన నామరూపాలున్ను అపరమాత్మవే, అని నమ్మి సకల దేవ దేవతలను సర్వమనోహరంగా వర్ణించి ప్రశంసించేరు. ద్వైతాచార్యులో కూడా శంకరులు రచించినన్ని స్తోత్రాలను ఎవరున్ను రచించలేదన్నది సాహసంకాదు. ఆతీరులో శ్రీ శంకరులు పరమ భాగవతోత్తములున్ను అయినారు. అస్తు.

ప్రకృతం :— ద్వాదశ జ్యోతిర్లింగ స్తోత్రము సామాన్యంగా మూలంమాత్రమే కనబడుతుంది. కవి పండిత మిత్రులు కవితామిత్రులు శ్రీ కొండేపూడి సుబ్బారావుగారు ఇందలి ఒక శ్లోకానికి ఒక పద్యంగా తెలుగులోకి అనువదించి, తాత్పర్యం, విశేషార్థం అను అంశాలను కూడా చేర్చి ఆంధ్ర భాగవతులకు అందించినారు. ఆయా లింగములకు సంబంధించిన పురాణ కథలను, క్షేత్రమాహాత్మ్యములను కూడా చక్కగా వివరించినారు. కాగా ఈ స్తోత్రం సర్వాంగసుందరంగా రూపు దిద్దుకున్నది. ప్రత్యే

కంగా ఒక్కసంగతి. మూలంలోని ఛందస్సు వేరు. అనువాదంలోని ఛందస్సు వేరు. అందువల్ల అనువాదంలో అక్కడక్కడ సంకోచవికాసాలు తప్పవు. అయినను అనువాదం "అన్యూన అనతిరిక్తంగానూ, మూలవిధేయంగానూ సాగిందని చెప్పవచ్చు. చెయ్యితిరిగిన కవికిగాని సామాన్యునికిది సాధ్యంకాదు.

ఇక్కడ రెండు మాటలు చెప్పవలసి ఉంది. "లింగము" అనగా చిహ్నం — గుర్తు శివునకు ముఖ్యమైన గుర్తు "శివ లింగము". దీపజ్యోతి లింగాకారంగా ఉండును. ఆవిధంగా భావించి ధ్యానించుటయే అతి ముఖ్యం. అదే జ్యోతిర్లింగము. భవ, శర్వ, జ్వాల, సువర్ణ, ఆత్మ, , పరమమొదలైన పేర్లతో ఎన్నో లింగములను శాస్త్రములు వర్ణించును. అయినను జ్యోతిస్స్వరూపం ప్రధానమైనది. పావనమైనది. పన్నెండు జ్యోతిర్లింగముల అర్థం తాత్పర్యం కూడా ఇదే. అంతేకాని "జల లింగం" అంటే నీటిరూపం అని, "వాయులింగం" అంటే వాయురూపమని — అది సంభవమా? అని — ఇటువంటి తర్క వితర్కాలు చేయకూడదు — చేయనక్కరలేదు. "ఆత్మయే జ్యోతిస్సు — అదే జ్యోతిర్లింగము" అన్నది పరమార్థం.

శ్రీ సుబ్బారావుగారు నిరంతర కవిత్వవ్యవసాయాత్మకులు - పరిపక్వమనస్కులు — తమ కవిత్వకేదారంలో ఎన్నో "ఫలసాయాలను పండించినారు. ఈ కృతివారు ఉపాసకుల కందించిన మరొక చక్కని "ఫలసాయం". పరమశివుడు వారికి సతతశివంకరుడగు గాక! అని ప్రార్థిస్తున్నాను.

# సౌరాష్ట్రే సోమనాథం

శ్లో. సౌరాష్ట్ర దేశే విశదే ౽ తిరమ్యే
జ్యోతిర్మయం చంద్రకళావతంసమ్
భక్తి ప్రదానాయ కృపావ తీర్ణం
తం సోమనాథం శరణం ప్రపద్యే ॥

సౌందర్యోజ్జ్వలమున్, మనోహరమునౌ సౌరాష్ట్రదేశమ్మునం దిందుస్వచ్ఛకళావ తంసుడు కృపావీక్షుండు జీవాళి కిం పొందన్ భక్తి ననుగ్రహించు కొఱకై జ్యోతిర్మహాలింగశో భంబై వారెడు సోమనాథు శరణం బర్థింతు నత్యంతమున్.

తాత్పర్యము; పరిశుభ్రము మిగుల రమణీయమునైన సౌరాష్ట్ర దేశమున (గుజరాతు) ప్రజలకు భక్తిని ప్రసాదించుకొఱకై పరమదయాళువై అవతరించిన చంద్రచూడుడు తేజోరూపు డైన సోమనాథేశ్వరుని శరణు పొందుచున్నాను.

విశేషార్థము: భక్తి భావముకూడ భగవంతుని అనుగ్రహముచే సిద్ధించునదే. పరమాత్మ అంశ సర్వభూతకోటి యందును గలదు. పరిశుభ్రమగు సౌరాష్ట్రమువలె మన మనోదేహ ప్రదేశములను నిర్మల మొనరించి మనలోనున్న పరమాత్మ అంశనెఱుగు ఆసక్తి నియమములు గల సాధకునకు తదను గుణమగు భక్తి భగవ దనుగ్రహమున కలుగును- జీవాత్మ పరమాత్మతో ఐక్యము కలుగుటే అవ్యయానంద ప్రదమగు పరమపద సిద్ధి. ఆ సిద్ధిని పొందుటకు చెప్పబడిన భక్తి కర్మ

ధ్యాన జ్ఞానయోగాది మార్గములలో, సాధకుడు భగవానుని శరణు పొందుట అత్యుత్తమ సాధనగా చెప్పబడినది.

సోము డనగా చంద్రుడు. చంద్రునకు రక్షణ కల్పించిన పరమశివుడు సోమనాధునిగా భక్తుల ప్రార్థనపై అట వెలసెను. సోమనాధు డనగా (స + ఉమ) ఉమా సహితుడైన పరమశివునిగా కూడ చెప్పవచ్చును.

క్షేత్రమహిమ:- సోమనాథ జ్యోతిర్లింగము సౌరాష్ట్రము నందున్న ప్రభాస తీర్థమున వెలసి యున్నది. ఈ క్షేత్ర మహిమను గూర్చిన పూర్వగాథ పురాణము లందిట్లు వర్ణింపబడినది.

బ్రహ్మకుమారుడగు దక్ష ప్రజాపతి తన యిరువది యేడ్గురు పుత్రికలను (తారలు) చంద్రునకిచ్చి వివాహము గావించెను వారిలో మిగుల సౌందర్యవతియగు రోహిణియందే నెక్కువ మక్కువ చూపుచుండుటచే తక్కినవారు తమ దైన్యమును తండ్రియగు దక్షుని వద్ద కేగి మొర పెట్టిరి "దక్షుడు మందలించినను చంద్రుడు వినకపోవుటచే, దక్షుడు కోపించి చంద్రా! నీవు కళావిహీనుడ" వగుదువని శపించెను. చంద్రుడు క్షయరోగపీడితుడై కళావిహీనుడగుటతో ఓషధులు నశించినవి, సృష్టి నిస్తేజ మైనది అమృతాహారులగు సురలు తల్లడిల్లిరి_హవిస్సులు గూడ వారి కందుటలేదు_ ఈ సంక్షోభము నుండి బయట పడుట కన్యోపాయము తోచక సురలు మునులు చంద్రుని వెంట బెట్టుకొని బ్రహ్మవద్దకేగి ఈ యువద్రవము నుండి కాపాడుమని వేడిరి. బ్రహ్మ ఉపదేశాను సారము చంద్రుడు పవిత్ర ప్రభాస తీర్థమున మృత్యుంజయ మంత్రమును జపించుచు శివుని

గూర్చి మహా నిష్ఠతో తపమొనర్చెను. ఆ తపమునకు మెచ్చి పరమశివుడు ప్రత్యక్షమై చంద్రుని అభీష్ట మెఱిగి. "చంద్రా! దక్షుని వాక్కు అమోఘమైనది. దానిని తప్పింప వీలు లేదు. కృష్ణపక్షములో మాత్రము నీకళలు క్షీణించును శుక్ల పక్షమున దినదిన ప్రవర్ధమానుడవై పూర్ణిమ నాడు షోడశ కళలతో ప్రకాశింతు" వని వరమిచ్చెను. కళాహీనుడు మృత తుల్యుడు అయిన చంద్రుడు మరల లోకప్రియముగా వెలు గొంద సాగెను.

అచట ప్రత్యక్షమైన సదాశివునకు, చంద్రుడు, సురలు, మునులు సాగిలపడి' పరమశివా మహేశ్వరా! ప్రజలేమి, వేలుపులేమి అవివేకమున ఎన్నియో తప్పులు చేయుదురు. సర్వయుగముల సర్వవేళల వారి నా పాపముల నుండి రక్షింప వలయునని ప్రార్థింపగా, పరమ శివుడు ఉమా సహితురుడై సోమనాథజ్యోతిర్లింగరూపమున ప్రభాసతీర్థమున వెలసి నేటికిని పూజలనందుచు భక్తరక్షకుడై విరాజిల్లుచుండెను శివస్మరణ మంత్రములలో విశిష్టము ప్రభావోపేతమునైనది మృత్యుం జయమంత్రము-ఆ మంత్రపాఠమిది.

"త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్
ఉర్వారుకమివ బంధనాత్ మృత్యోర్ముక్షీయ మామృతాత్"

ఈ పవిత్ర మంత్రము అపమృత్యువునుండి తప్పింప గలిగిన మహాశక్తిమంతము, భక్తులెల్లరకు రక్షణగానున్నది.

—**—

# శ్రీశైలే మల్లికార్జునం

శ్లో. శ్రీ శైలసంగే విబుధాతి సంగే
తులాద్రి తుంగేఽపి ముదావసంతమ్
తమర్జునం మల్లికపూర్వమేకం
నమామి సంసార సముద్రసేతుమ్॥

శ్రీశైలమ్మున శృంగభాసిత తులాద్రిన్, వేల్పులెల్లన్ సమా
వేశంబౌ స్థలమందు నిత్యము సముద్వేల ప్రమోదంబుతో
వాసంబుండు భవాబ్ధిసేతువు, జగద్భద్రానుసంధాయి, స
ర్వేశుండొక్కడు మల్లికార్జునున కర్పింతున్ నమోవాకముల్

తాత్పర్యము; శ్రీశైలక్షేత్రమున పవిత్రమగు తులాద్రి శిఖరమున సర్వదేవతల సాంగత్యమున మహాసంతోషముతో నివసించుచు, సంసార మహార్ణవము నుండి దాటించు భక్తలోక రక్షకదైవము పరమేశ్వరుడు మల్లికార్జునునకు ప్రణామము లర్పించుచున్నాను.

విశేషము : శ్రీశైలాధిపతి ఈశ్వరుడు మల్లెపూవులతో పూజింపబడును. సంధ్యావేళల వికసించు మల్లిక రాత్రి సమయ మంతయు పూర్ణవికసనముతో పరిమళము విరజిమ్ముచునే ఉండును. సంధ్యాతాండవలోలుడగు ఈశ్వరుడు రాత్రి కాలమునను (ప్రళయ) మెలకువగనే ఉండును, మల్లిక ఈశ్వరపూజకనుపై

నది_ఈశ్వరునకు ప్రియమైన పుష్పము మల్లిక. అర్జునమనగా మద్దిచెట్టు. మల్లెతీగ అల్లుకొనిన అర్జున వృక్షమును పరమశివునిగ భావించి పూజింతురు. భక్తరక్షణకై పార్వతీపరమేశ్వరు లిచట భ్రమరాంబా మల్లికార్జునులుగ సన్నిధిచేసియున్నారు. జన్మ మృత్యుసంకలితమగు సంసారబాధలనుండి విముక్తినొందించు ప్రభువా ఈశ్వరుడే. భ్రమరమనగా ఆడుతుమ్మెద ఇచటి ఆలయ అంతర్భాగమున ఓంకార స్వరముగ భ్రమర నాదము వినిపించును.

తులాద్రి యనుటలో కైలాసమునకు తులమైనది శ్రీశైల మని ఒక కథన మున్నది. అది కాక, తుల యనగా త్రాసు. రెండు సిబ్బెలు వానిని కలుపు దండము _ బ్రహ్మగిరి రుద్రగిరి విష్ణుగిరి యని త్రిమూర్త్యాత్మకముగా యిచటి పర్వతశ్రేణి పూజనీయముగా నున్న దనియు ప్రసిద్ధి కలదు—

కృష్ణానది యిచట పాతాళ గంగగా ప్రవహించును_
క్షేత్రకథ : పార్వతీ పరమేశ్వరుల కుమారులు గణపతి, స్కం దులు. వా రిరువురును పెండ్లికి తొందర పడుచు ఒకరితో నొకరు కలహించుచుండ తల్లి దండ్రులు వారి నాపి "భూ ప్రదక్షిణము చేసి ముక్కోటి తీర్థాలలో సుస్నాతులయి దైవ దర్శనము చేసి కొని మీ యిరువురిలో యెవరు ముందు వచ్చిన వారికి ప్రథమ మున కళ్యాణమగు" నని నుడివిరి. కుమారస్వామి వెంటనే తన నెమలి వాహనముపై భూ ప్రదక్షిణమునకు బయలు దేరెను. వినాయకుడు లంబోదరుడు, ఆయన వాహనమా యెలుక, తనకు భూ ప్రదక్షిణము వేగముగా చేసి వచ్చుట అసాధ్యము. తన కుశాగ్రబుద్ధి నుపయోగించినాడు—

అంజలి బద్ధుడయి మాతృదేవోభవ పితృదేవోభవ యని జపించుచు భక్తి శ్రద్ధలతో పార్వతీ పరమేశ్వరులకు మువ్మారు ప్రదక్షిణము చేసి వారి యెదుట నిలచి "మీ రిరువురు త్రిలోక జననీజనకులు విశ్వాత్మకులు, మీకు ప్రదక్షిణము చేసి పూజించుట ధర్మశాస్త్ర ప్రకారము భూప్రదక్షిణముచేయుటే" అనగా వినాయకుని బుద్ధికి అతడు పొందిన సర్వాంతర్యామి దర్శనమునకు సంతసించి, శివపార్వతులాతనికి విశ్వరూప ప్రజాపతి పుత్రికలగు బుద్ధిసిద్ధుల నిచ్చిరి. బుద్ధి నుపయోగించి ఇట్లు సిద్ధినందిన గణపతి తన కంటె ముందుగనే భూప్రదక్షిణము చేసి వచ్చినట్లు స్కందునకు తోచినది.

అయినను తనకు తల్లిదండ్రుల అనుగ్రహము కలుగలేదనుభావముతో అలిగి కుమారస్వామి శ్రీశైల ప్రాంతమున క్రౌంచశిఖరమునకేగి అచటనే ఉండెను. నారదునితో సహితము ఎవరి చేత తల్లిదండ్రులు వార్తనంపినను స్కందుడు తిరిగి రాకపోవుటచే, ప్రాణి కోటికి కుమారుని యందును భక్తి భావముకలిగించుటకై కైలాసవాసిని పార్వతి భ్రమరాంబగా అటకు దిగివచ్చినది. ఆవెనుక సదాశివుడును మల్లికార్జున జ్యోతిర్లింగముగా అచట అవతరించెను. సర్వదేవతలు అనుదినము ఆస్వామిని దర్శించి పూజింతురు.

శ్రీశైల శిఖరము జూచినజాలు మోక్షసంపద అబ్బునని శాస్త్రోక్తి. అసంఖ్యాకులగు భక్తులు నేటికిని నిత్యమా జ్యోతిర్లింగమును దర్శించి పూజించి ధన్యులగుచున్నారు.

# ఉజ్జయిన్యాం మహాకాళం

శ్లో॥ అవంతికాయాం విహితావతారం
ముక్తిప్రదానాయచ సజ్జనానామ్
అకాలమృత్యోః పరిరక్షణార్థం
వందేమహాకాళ మహామరేశమ్ ॥

పరమోదాత్తమవంతికాపురమునన్ ప్రాదుర్భవంబంది, స
త్పురుషశ్రేణి కకాలమృత్యుభయమున్ దూరమ్ముగావించి, మో
క్షరమా భాగ్యమొసంగు సర్వదివిజస్వామిన్ మహాకాళునిన్
కరముల్ మోడ్చి వినమ్రభావుక నమస్కారమ్ములన్ గొల్చెదన్

తాత్పర్యము : సజ్జనులను అకాలమృత్యువునుండి రక్షించి, మోక్షమునొసంగుటకై అవంతీపురములో నవతరించిన దేవదేవుడు మహాకాళునకు నమస్కారము లర్పించెదను-

అవంతిక నేటిఉజ్జయినీనగరము- అయోధ్యా మాయా మథుర్హా కాశీ కాంచీ అవంతికా ద్వారవతి అను సప్తపుణ్యనగరములలో ఒకటి - అవంతిక అను మనదేహమున నున్న పరమాత్మనెఱుగు సాధకులు అకాలమరణమునుండి తప్పించుకొని మోక్షభాగ్యము నందగలరు- ఆపరమాత్మయే దేవదేవుడైన మహాకాళుడు-

క్షేత్రకథ: పూర్వముజ్జయిని పట్టణమున వేదప్రియుడను మహాభక్తుడుండెను. అతడు తన తనయాళితోగలిసి నిరంతరశివధ్యానతత్పరుడై జీవితము గడపుచుండెను. ఆ సమీపమున రత్నమాల యను పర్వతమున వసించు దూషణుడను రాక్షసుడు ప్రజలను పీడించుచు తుదకొకనాడు వేదప్రియుని చంపుటకేతెంచెను. వేదప్రియుని సత్శీలము నెఱిగిన చుట్టుపట్టుల ప్రజలెల్లరు ఆక్రూర కార్యమునకు భీతిల్లి చేసిన ఆర్తనాదములు మిన్నుముట్టినవి. దయాళువయిన పరమశివుడు తక్షణమే కైలాసమునుండి ఉగ్రుడై మహాకాలరూపమున వచ్చి ఆ రాక్షసుని భస్మముగావించెను. ఆ రక్కసుని పీడ నశించి దేశమెల్లెడల శాంతి సౌఖ్యములు నెలకొనెను. వేదప్రియుని భక్తికి సంతసించి పరమశివు డాతనిని కావలసినదదేని ఒకవరము కోరుకొనుమని కరుణించి నుడువగా వేదప్రియుడు శివునకు ప్రణమిల్లి "దేవా నీయనుగ్రహమున్న చాలు మాకు సకల సంపదలు సమకూడును. మాకీరాక్షసులపీడ వదల్చితివి, నీభక్తుల కెల్లరకు భవిష్యత్కాలమున కూడ అకాలమృత్యుభయము లేకుండ కాపాడుచు నీ విచటనే సన్నిధి చేసి మా పూజలందుకొనుము" అని పాదములవ్రాలెను. ఆప్రార్థనలాలించి పరమశివుడు మహాకాలజ్యోతిర్లింగముగ నచట వెలసెను.

మఱియొక కథ : ఉజ్జయిని నగరమును పూర్వము శివభక్తుడయిన చంద్రసేన మహారాజు పాలించుచుండెను. ఆ రాజు భక్తి శ్రద్ధలు పూజలు చూచి శ్రీకరుడను అయిదేండ్ల గోపబాలుడు తానును శివపూజయందాసక్తి కలవాడై దారిలో దొరకిన ఒక రాతి ముక్కను శివలింగముగా భావించి ఇంటికి తీసికొని పోయి పూజించుచుండెను, నిద్రాహారములు మాని

నిరంతర దీక్షతో శివుని పూజించు బాలుని జూచి తల్లి దండ్రులు ఎంత చెప్పినను ఆ బాలుడు తన శివధ్యానమును మానడయ్యెను. దినములు మాసములు గడచినవి. ఒక నాడా శివ పూజలో తన్మయుడై అలసి శివునికొఱకు నాక్రందించుచున్న శ్రీకరున కెదురుగ మహాకాళ మందిరము అందొక జ్యోతిర్లింగము కనుపించినవి. ఆ బాలుని ఆనందమునకు మేర లేదు. ఆదృశ్యమునకు వాని తల్లి దండ్రులు ప్రజలు చంద్రసేన నృపతియు యచటి కేతెంచి చూచి యద్భుతాశ్చర్య మగ్నులై యుండ శ్రీరామ భక్తుడు శివాంశ సంభూతుడు నగు హనుమంతుడు ప్రత్యక్షమై సర్వ విశ్వమునకు శరణ్యు డయిన శంకరుడిచట మహాకాళేశ్వరునిగ అవతరించినాడు. ఆజ్యోతిర్లింగ మాదేవుని అర్చారూపము మీరెల్లరు భక్తి శ్రద్ధలతో ఈపరమ శివునకు నిత్యము పూజలొనరించుచు ధన్యులు కండు ''అని ఉపదేశించి అంతర్ధానుడయ్యెను. బాలభక్తుడగు ఆ శ్రీకరుడు ఎనిమిదవ తరమున నందగోపుడై శ్రీకృష్ణుని పెంచెనని ప్రసిద్ధి కలదు.

పరమదయాళుడు భక్తరక్షకుడై శివుడు మహాకాళజ్యోతిర్లింగ రూపమున ఉజ్జయిని యందు పూజలనందుకొను చున్నాడు.

—✱✱—

# ఓంకారే పరమేశ్వరం

శ్లో. కావేరికా నర్మదయోః పవిత్రే
సమాగమే సజ్జన తారణాయ ।
సదైవ మాంధాతృ పురేవసంత
మోంకార మీశం శివమేక మీడే ॥

మును మాంధాతనృపాలు డేలిన మహాపుణ్యస్థల మ్మౌ పుర
మ్మున, కావేరియు నర్మదానది జలమ్ముల్ సంగమమ్మొందు పా
వన భూమిన్ సుజనాళితారణుడునై వాసించు నీశున్ శివున్
ప్రణుతోంకారము పేరు నొక్కనిమదిన్ భావించి కీర్తించెదన్.

తాత్పర్యము: నర్మదా, కావేరికా నదులు సంగమమైన పుణ్య ప్రదేశమున, ఇక్ష్వాకువంశనృపతి మాంధాత పాలించిన పుర మందు సజ్జనులను తరింపజేయు కరుణతో ఓంకారేశ్వర నామ మున జ్యోతిర్లింగముగ వెలసిన జగదేకదైవము పరమశివుని సన్నుతింతును.

నర్మదా, కావేరికా నదులు వ్యక్త వ్యక్త మనోవృత్తులకు సంకే తములు కాగా, ఓంకారనాదమయుడైన పరమశివుడు దేహమను పురమున నున్న అంతర్జ్యోతి, మాంధాతృపురే (మాం-నన్ను ధాతృ=ధరించిన పురే=పురమందు) నివసించియున్నాడు. ఆ జ్యోతిర్మయునకు నమస్కరించుచున్నాను అని వేదాంతార్థము -
క్షేత్రకథ: మాలవదేశమున నర్మదానది పాయలు నర్మదా

# కేదారం హిమవత్పృష్ఠే

శ్లో. మహాద్రిపార్శ్వేచ తటేరమంతం
సంపూజ్యమానం సతతం మునీంద్రైః
సురాసురైర్యక్ష మహోరగాద్యైః
కేదార మీశం శివమీశ మీడే ॥

అమరవ్యాళ ము నీశ్వరప్రవరయక్షానీక రక్షస్సమూహముచే నిత్యము పూజనీయుడయి శ్రేయమ్ముల్ ప్రసాదించుచున్-

హిమవత్ శైలతటస్థితిన్ వెలయు సర్వేశున్ మహాభక్తి చిత్తమునన్ నిల్పినుతింతు నిచ్చలును కేదారేశ్వరాఖ్యున్ శివున్

తాత్పర్యము : భారతదేశచరిత్రలో వేదకాలము నుండియు ప్రసిద్ధిగనిన కులపర్వతములేడింటిలో హిమాద్రియొకటి. సురాసుర యక్షోరగ మునిముఖ్యులకు నిత్యము పూజనీయుడై జగత్ శుభంకరుడై హిమాచల పార్శ్వమున సమ్ముదితస్వాంతముతో వసించు కేదారేశ్వరాఖ్యుడైన పరమశివుని నిత్యము భజింతును-

క్షేత్రకథ : హిమవత్పర్వత కేదారశిఖరమున కేదారేశ్వర జ్యోతిర్లింగమున్నది. ఆప్రాంతమునందే శ్రీమన్నారాయణుని అవతారములు, ధర్మునకు దాక్షాయణికిని ఉద్భవించిన నరనారాయణులు మహాతపస్సొనర్చిన బదరీనాథమును అదు-కేదారమునుండి వచ్చు మందాకినియు, బదరి నుండి

వచ్చు అలకానందనదియు రుద్రప్రయాగ వద్దకలసి భాగీరథి నామమొందుచున్నవి. ఆ నదులందు సుస్నాతులై కేదారేశుని బదరీనాథుని దర్శించు భక్తులకు సర్వపాపములునశించి జీవన్ముక్తికలుగునని స్కాందాదిపురాణములు నుడువుచున్నవి.

నరనారాయణులు మహాతపస్సంపన్నులు. బదరీకాశ్రమమున వారు దీర్ఘకాలము దీక్షతో తపస్సొనర్చిరి. వారి తపస్సువలన తన పదవి కెట్టి ఉపద్రవము కలుగునో అను భయమున ఇంద్రు డప్సరోవనితల నంపి వారి తపస్సును భంగమొనర్పయత్నించెను గాని జితేంద్రియులైన యామహాఋషులు చలింపలేదు - వారిరువురును ప్రతిదినము కేదారమున కేగి మందాకినీ పవిత్రజలముల స్నానమొనర్చి పరమేశ్వరుని లింగముల నిర్మించి బిల్వాది పత్రపుష్పములతో పూజించుచుండిరి. నరనారాయణుల భక్తికి మెచ్చి పరమశివుడాదరముతో ప్రత్యక్షమై. మీయభీప్సితములను కోరుకొనుడనగా వారు ఆ మహాదేవుని అనేక విధముల కీర్తించి మహాదేవా నీవు కేదారేశ్వరనామమున ఈ స్థలమునందే భక్తవత్సలుడవై లోకకల్యాణార్థము వసించుచుండవలసినదని ప్రార్థించిరి. పరమశివుడావిన్నపము మన్నించి కేదారేశ్వర జ్యోతిర్లింగముగ నచట వెలసెను.

ద్వాపరయుగమున పంచపాండవులును కేదారేశుని భజించి ధన్యులైరి.

కులపర్వతములు ఏడు మహాపవిత్రములైనవి. అవి మహేంద్ర, మలయ, సహ్య, హిమవత్, ఋక్షవత్ వింధ్య, పారియాత్రములు.

# డాకిన్యాం భీమశంకరం

శ్లో. యోడాకినీ శాకినికా సమాజైః
నిషేవ్యమాణః పిశితాశనైశ్చ
సదైవ భీమాది పదప్రసిద్ధం
తం శంకరం భక్తహితం నమామి ॥

మనముల్ భీతిల, భీమశంకరము నామం బొప్పక్షేత్రమ్ము నం
దున మాంసాశనులున్, భయంకర ప్రవృత్తుల్ శాకినీ డాకినీ
ఘన బృందమ్ములు గొల్వ శంకరుని భక్తానీక సంరక్షకున్
వినయం బొప్పభజించి సల్పుదును సంప్రీతిన్ నమస్కార
ముల్

తాత్పర్యము; మాంసాశనులయిన శాకినీ డాకినీ పిశాచ సమూహములచే నిత్యము సేవింపబడు భక్తరక్షకుడు భీమ శంకరునికి నమస్కరించుచున్నాను–

శంకరుడు భీమస్వరూపుడు, ప్రళయభయంకరుడు. మాంసాహారములు తిను శాకినీ డాకినీ పిశాచసమూహములు గూడ ఆ శంకరుని ప్రళయరుద్రుని ఎల్లవేళల సేవించుచునే ఉండును. ప్రళయము అన్నిటికి అంతమయినను అదే మరల సృష్టికి ఆరంభము భక్తులకు నిత్యము ఆశంకరుడు శుభంకరుడే.

క్షేత్రకథ: భరతోర్వి పశ్చిమసముద్రతీరమున నున్న సహ్యా పర్వతశ్రేణిలో డాకిని యను శిఖరమున్నది – భీమానది ఆ

ప్రాంతము నందే ప్రాదుర్భవమంది ప్రవహించును. ఆ శిఖరమున పరమేశ్వరుడు భీమశంకర జ్యోతిర్లింగరూపమున వెలసి శాకినీ డాకినీ పిశాచసమూహములు చుట్టు జేరిసేవించు చుండ భక్తజనశుభంకరుడై విరాజిల్లుచున్నాడు.

క్షేత్రకథ : ఆపర్వతములందే కర్కటుడు పుష్కసి అను రాక్షస దంపతులు నివసించుచు నరమాంసభక్షకులై ప్రజలను బహు విధముల పీడించుచుండిరి. వారి కుమారిత కర్కటి విరాధుడను రాక్షసునికి భార్యయైనది. త్రేతాయుగమున శ్రీరామచంద్రునిచే వధింపబడి విరాధుడుపుణ్యలోకముల కేగెను. కాని కర్కటి మాత్రము తన రాక్షసగుణములు వదలలేదు. ఆమె తల్లి దండ్రులు కర్కటుడు పుష్కసి, అచట భీమానదిలో స్నానమాడవచ్చిన అగస్త్యమహాఋషిని హింసింపబోయి ఆ ముని క్రోధాగ్నికి భస్మమయిరి. కర్కటి మరల రావణాసురుని తమ్ముడైన కుంభకర్ణుని వివాహమాడి వాని వలన భీముడను సుతుని బడసెను. సహజముగ భీమాసురుడు బలవంతుడు, అసురగుణములన్నియు అతనిలో నిండిఉన్నవి, దానికితోడు విరాధుని సంహరించిన శ్రీరాముడే తనతండ్రి కుంభకర్ణుని, పెదతండ్రిరావణుని సంహరించుటతో నరులపై మఱింతద్వేషము ను భీమాసురుడు పెంచుకొనెను. ఎట్లయిన తన పగతీర్చుకొన దలచి అతడు బ్రహ్మను గూర్చి కఠోరతప మాచరించి తత్ఫలితముగ దుర్వారబలుడై దేశము నలుప్రక్కలతిరిగి భగవద్భక్తులను దైవపూజాపరులకు హింసించుచు తిరుగులేని వీర విహారము సలుపుచుండెను.

ఎచ్చటనో దూరమున ఉన్న కామరూపరాజ్యాధిపతి సుదక్షిణు నోడించి తీసికొనివచ్చి భీమాసురుడు తన గృహమందు బంధించి ఉంచెను. సుదక్షిణుడు మహాశివభక్తుడు – ఎన్ని బాధలు పడుచున్నను సుదక్షిణుడు తన శివపూజను విడువక తానున్న కారాగారము నందే నిత్యము ఇసుకతో శివలింగమును చేసి నిశ్చల భక్తితో పూజించుచుండెను. భీమాసురన కారాజుచేయు శివపూజగిట్టలేదు. దానిని ఆపుజేయుట కెన్నో అవరోధములు కల్పించెను. కాని సుదక్షిణుడు తన దీక్ష మానక పోవుటజూచి భీమదైత్యుడు కుపితుడై తన ఖడ్గముతో ఆ శివలింగమును కొట్టుటేతతవుగ ఆ లింగమునుండి ఫాలాక్షుడుగ్రుడై ఉద్భవించి తన నేత్రాగ్ని వీక్షణములతో ఆరాక్షసుని భస్మమొనర్చెను. భీమాసురుని చావుతో ప్రజలు సుఖించిరి– దైవభక్తియథా పూర్వము విరాజిల్లెను–

సుదక్షిణాది భక్తులప్రార్థనల నాలించి శంకరుడు భీమశంకర నామమున జోతిర్లింగాకృతిని ఆవిర్భవించి అచటనే భక్తరక్షకుడై యుండి ప్రజలచే పూజింపబడుచుండెను–

((()))

# వారాణస్యాంచ విశ్వేశం

శ్లో. సానంద మానందవనే వసంత
మానందకందం హతపాపబృందమ్
వారాణసీ నాథమనాథ నాథం
శ్రీవిశ్వనాథం శరణం ప్రపద్యే-

ప్రణుతానందమయుండు సర్వదురితప్రధ్వంసి ఆనందకా ననవామాంచిత కాశికాపతిని ఆనందాకృతిన్ ప్రేమ భా వనిధానాత్ము ననాథనాథుని ఉమాప్రాణేశు శ్రీ విశ్వనా థుని నాకున్ శరణమ్ము నీవెయని కొల్తున్ భక్తి నత్యంతమున్

తాత్పర్యము : బ్రహ్మానందమయుడు, ఆనందస్వరూపుడు, ఆనందకాననమగు కాశీపురము (వరుణ అసి అను నదులమధ్య పురము వారణాసి) యందు వసించువాడు, పాపములనశింప జేయువాడు, అనాథనాథుడను కీర్తితో విరాజిల్లు శ్రీ విశ్వ నాథుని శరణు పొందుచున్నాను.

ఆత్మజ్ఞానము కల్గించి జీవిని రక్షించు పుణ్యరాశియని కాశికి ప్రసిద్ధి. దేహాంత సమయమున జనులకు కుడి చెవిలో కాశియందు నమశ్శివాయ మంత్రము నుచ్చరించు మాత్ర మున ముక్తిలభించునని ఆర్యోక్తి. వరుణ అసి నదుల సంగ మము వారణాసి జీవేశ్వరైక్యమునకు సంకేతమనియు: భక్త జనులకైకైక శరణ్యమయి రక్షించు అనాథనాథుడాశంకరు డనియు ప్రసిద్ధి. పాపరహితునిగా జేసి జీవికి అవ్యయానంద పదలబ్ధినొసగుటకు శరణ్యమా విశ్వనాథుడే-జీవునకు దేహేం ద్రియమనః స్థితులను దాటిన శుద్ధసత్వ సుస్థితి కల్పించు ఆనందవనము ఆకాశి-

క్షేత్రకథ : శ్రీకాశీప్రాంత పరిసరములన్నియు పెక్కు పుణ్య ప్రదేశములతో విరాజిల్లుచున్నవి - దుండి విఘ్నేశ్వరుడు బిందుమాధవుడు కాలభైరవుడు కుమారస్వామి అన్నపూర్ణ గంగ, మణికర్ణికలు గల మహాపుణ్యప్రదేశము కాశి. ప్రళయ కాలమున గూడ పరమశివుడు తనత్రిశూలమున కాశిని పైకెత్తి రక్షించునని ప్రసిద్ధి. వేదాది సర్వపురాణ శాస్త్రము లలో కాశీక్షేత్రమహిమ వర్ణింపబడియున్నది-

సృష్ట్యాదిని సచ్చిదానంద పరబ్రహ్మము యొక్క సగుణరూపములగు శివశక్తులు ప్రకృతి పురుషులను సృష్టించి నవి. పురుషుడే శ్రీమహావిష్ణువు, ప్రకృతి పురుషుల తపస్సునకై నిర్మించి యిచ్చిన సుందరనగరమే కాశి. శివపురి, క్షేత్రపురి, ఆనంద కాననము, మహాశ్మశానము అనియు కాశికి పేర్లు - తపోదీక్షనున్న శ్రీవిష్ణువు దేహమునుండి స్రవించిన స్వేదజలములు మహాప్రవాహములైనవి- ఆజలములందు మునిగిపోకుండ పరమశివుడు కాశిని కాపాడెను - ఇందులకు తపస్వియగు పురుషుడానందమున తల యూపగా ఆమూర్తి కర్ణమందుండి జారిపడిన మణి భూషణమే మణి కర్ణికాక్షేత్రమ యినది- ఆజలరాశిపై నిద్రించు విష్ణు నాభికమలము నుండి చతుర్ముఖ బ్రహ్మ ఉద్భవించి శివాదేశమున సృష్టి నారంభించెను-

బ్రహ్మ, విష్ణువు ఆదిగా, సర్వదేవతల ప్రార్థనల మన్నించి కాశియందు, పరమదయాళుడు భక్తజనరక్షకుడు ముక్తిప్రదాత అయిన పరమశివుడు శ్రీవిశ్వేశ్వర జ్యోతిర్లింగాకారమున యావిర్భావమునంది సర్వజనపూజనీయుడై కాశీనగర మున విరాజిల్లుచున్నాడు-

/=/

# త్ర్యంబకం గౌతమీతటే

శ్లో॥ సహ్యాద్రి శీర్షే విమలే వసంతం
గోదావరీ తీర పవిత్ర దేశే
యద్దర్శనాత్ పాతక మాశునాశం
ప్రయాతితం త్ర్యంబక మీశ మీడే॥

వినుతస్రోతసి గౌతమీజలము లావిర్భావముం బొందు పావన తీరమ్మున సహ్యశైల శిఖరావాసమ్ము గైకొంచు దర్శనకాలక్షణమందె పాపచయముస్ సర్వమ్ము నిర్మూలనం బొనరింపంగల త్ర్యంబకేశు మహిమమ్ముస్ భక్తి గీర్తించెదన్.

తాత్పర్యము: విపులమైన సహ్య పర్వత శిఖరమున పవిత్ర గోదావరి నది పుట్టి ప్రవహించు తీరప్రదేశమున వసించుచు దర్శనము చేసిన క్షణమందే భక్తుల పాపచయమును నశింపజేయు త్ర్యంబకేశుని భక్తి వినమ్రుడనై సంస్తుతించుచున్నాను.

ఆత్మవస్తువుచే సహింపబడునది దేహమను సహ్యాద్రి శీర్షము జ్ఞానలహరి యను పవిత్ర గోదావరినదికి జన్మస్థానము. శిరమునందు గల మేధ జ్ఞాననిలయము-జ్ఞానదర్శనము వలన పాపములణగి బ్రహ్మభావముగలుగును, పరమశివుడా బ్రహ్మభావ జ్యోతియే.

క్షేత్రకథ: త్ర్యంబకేశ్వర జ్యోతిర్లింగము మహారాష్ట్రమున గల నాసికమండలమందు సహ్యపర్వత శిఖరముననున్నది. అచటి నుండియే గోదావరిజలములుద్భవించి మహానదిగ ప్రవ

హించి తూర్పు సముద్రమున సంగమించుచున్నవి-అభ్రగంగా నది భగీరథుని తపఃఫలితముగ పుడమికి దిగివచ్చి భాగీరథియను నామమును బడసి ప్రజలకు పూజనీయ అయినట్లు గౌతమమహర్షిచే గోదావరి తీసికొనిరాబడి గౌతమియని నామమంది అనేకప్రదేశములను సస్యశ్యామలముగ జేసి పవిత్రమగు నదీమతల్లిగ భావింపబడుచున్నది - గోముఖము నుండి ఉత్పన్నమగు గోదావరి దర్శనము చాల పుణ్యప్రదము-ఇచట వెలసిన త్ర్యంబకేశ్వర జ్యోతిర్లింగము రుబ్బురోలులో గలలోతు భాగమువలె నుండును-బ్రహ్మ విష్ణు మహేశ్వరాత్మకములుగ భావింపబడు మూడుభాగములుగ ఆలింగము విలసిల్లుచు భక్తుల పూజలందుకొనుచున్నది.

గౌతముడు సప్తమహాఋషులలోనొకడు, మహాతపశ్శాలి. గౌతముడు, విశ్వామిత్రుడు భరద్వాజుడు అత్రి వశిష్ఠుడు కశ్యపుడు జమదగ్ని వీరుసప్తమహాఋషులు - గౌతమర్షి తన ధర్మపత్నియగు అహల్యతో చిరకాలము సహ్యగిరిని వసించి తపస్సొనర్చుచు మహాశివుని అనుగ్రహమునకు పాత్రుడై గొప్ప మహిమగలిగియుండెను. ఒకసమయమున త్రాగుటకు గూడ నీరు లభ్యముకాని మహాక్షామము వచ్చి ప్రజలల్లాడి పోవుచుండిరి-కరుణార్ద్రహృదయుడైన గౌతముడు వరుణుని ప్రార్థించి ఒక సరస్సును నిర్మించి పెక్కు ప్రజలనురక్షించెను- ఆ ప్రాంతమంతయు సస్యసమృద్ధమై సుభిక్షమయ్యెను - చుట్టుపట్టులగల పెక్కుచోటుల నుండి విప్రులు మునులు వారి కుటుంబములతో తరలివచ్చి గౌతము నాశ్రయము పొంది సుఖముగ నుండిరి - వారికే గాక ఇతరులెవరు వచ్చినను అచట

సుఖనివాసము లభించుచుండెడిది - గౌతముని చేతితో చల్లిన గింజలు అతడు స్నానము ముగించుకొని వచ్చునంతలో మంచి సస్యములై వలసినంత ధాన్యసంపద నిచ్చుచుండినవి-

అచటికి వలస వచ్చి గౌతమునివలన మహోపకారము పొందినవారే ఆమహాఋషియందుండవలసిన కృతజ్ఞతమాని, అసూయభావముతో ఆమునివరు నెట్లయిన అవమానింపదలచిరి- చావునకు సిద్ధముగ నున్న ఒక ముసలి యావును దెచ్చి వారా సస్యకేదారములపై తోలిరి. వందలాది ఆర్తులకు ఆహారమై యజ్ఞాహుతి నిచ్చు పంటల నీ జంతువు పాడుచేయునేమో అను తలపుతో గౌతము డొక గడ్డిపరకతో ఆయావు నదల్చెను. అది వెంటనే క్రిందబడి మృతి నందెను, ఆప్రక్కలనే చాటున కాచుకొని యున్న మునులు పరువు పరువున వచ్చి గౌతముని చుట్టు ముట్టి "గౌతమా! నీవేదియో నీతిపరుడవని అనుకొని నాము- ఈ ఆవును చంపి దుర్వారమైన గోహత్య పాతక మొనర్చితివి. అట్టి దుశ్చర్యకు శిక్షననుభవింపక తప్పదు- నీవు నీభార్యతో ఈ పర్వతమునకు మూడుసార్లు, భూమికొక సారి ప్రదక్షిణము చేసి వచ్చి గంగాజలములతో శివునభిషేకిం చినగాని నీపాపము పరిహారము" కాదని నిష్కర్షగ శాసించిరి గౌతముడు వినమ్రుడై ఆమునుల ద్వేషవాక్కులు శిరోధార్య ములుగ నెంచి, శివనామము జపించుచు పర్వత భూప్రదక్షిణ ములు మొదలిడెను-తన భక్తుడును నిరపరాధియు అయిన మహాఋషి గౌతముడు పడుబాధలకు పరమశివుని హృదయము గరగినది-ప్రసన్నుడై శివుడు ప్రత్యక్షమై గౌతమునకభయ మిచ్చి అసూయా మాత్సర్యములకు వశులైన మునిబృంద

ముపై కోపదృష్టులసారించి వారిని శిక్షింపదలంచెను_గౌతముడది గ్రహించి ఆ గంగాధరుని కాళ్ళపై వ్రాలి "మహాదేవా, మేమందరమును మీదాసులమే, వీరు కారణముగ నాకు నీ సాక్షాత్కారములభించినది, గంగాప్రవాహమును కొంత ఇచట ప్రవహింపజేసి గోహత్యాపాపమునుండి నన్ను ముక్తునిజేసి ఈమునులనుగూడ కరుణింపవలసిన"దని వేడగా శివుడట్లే అనుగ్రహించి తన జటనొకదాని నుండి గంగను ప్రవహింపజేసెను. మునులెల్లరును గౌతముని మాహాత్మ్యమెఱిగి తమ తప్పు తెలిసికొని పశ్చాత్తప్తులై, గౌతమఋషితో కలిసి పరమశివుని కాళ్ళపై బడి క్షమాభిక్షనర్థించి, దేవా! నీవిచ్చట సన్నిధి చేసి భక్తజనులకు ఎట్టి బాధలు రాకుండ ప్రాపుగనుండ వలసినదని వేడిరి-పరమశివుడు వారి యెడలకరుణించి సూర్య చంద్రులు అగ్ని తనమూడుకనులుగా త్ర్యంబకేశ్వర జ్యోతిర్లింగముగ ఆక్షేత్రమున వెలసెను_గౌతముడు శివునిజట నుండి వచ్చిన గంగాజలముతో ఆ మహాదేవుని కభిషేకమొనర్చి ధన్యుడయ్యెను. ఆ జలప్రవాహమే గౌతమీగంగ యను నామమున గోదావరి నదిగప్రసిద్ధి కెక్కి దండకాటవి పర్వతముల ద్వారా ఆంధ్రావని పావనమొనర్చి తూర్పు తీరమునకు ప్రవహించి సాగరమున సంగమించెను—దక్షారామ భీమేశ్వర సప్తగోదావరిక్షేత్రము లీ తూర్పుతీర ప్రాంతమునందేకలవు—దండకాటవిలో ఈ గోదావరి తీరమున పంచవటి యందు శ్రీరామచంద్రుడు సీతయు, లక్ష్మణుడు వెంటరా, తమ ఆరణ్యవాస కాలమునవసించిరి— గోదావరి జలములు ప్రవహించిన ప్రాంతములెల్ల సస్యశ్యామలములై ధన ధాన్య సంపదలతో వర్ధిల్లుచున్నవి_

నేటికిని ఈగోదావరి జలముతో త్ర్యంబకేశ్వరున కభిషే కించిన వారికి భుక్తిముక్తులకేలోటు లేకుండ పరమశివుడను గ్రహించుచున్నాడు-

/=/

# నాగేశం దారుకావనే

శ్లో. యామ్యే సదంగే నగరేఽతిరమ్యే
విభూషితాంగం వివిధైశ్చభోగైః
సద్భక్తి ముక్తి ప్రదమీశమేకం
శ్రీ నాగనాథం శరణం ప్రపద్యే ॥

అమలో దాత్తమనోజ్ఞ రూప సుభగంబై యామ్య దిగ్భాగ సం స్థితమై యొప్పిన దారుకానగర మందీశుండు నానావిధ స్తుత భోగేంద్ర విభూషితుండగు దయాత్మన్ భక్తిముక్తి ప్రదో న్నత చారిత్రుని నాగనాథు శరణొందన్ నిత్యమర్థించెదన్-

తాత్పర్యము : దక్షిణ దిగ్భాగమందున్న అతి మనోహరమగు దారుకానగరమున నానావిధ సర్వ భూషణాలంకృతుడు, జనులకు భక్తిని భవముక్తిని ప్రసాదించు ఏకైక మహాప్రభువు నాగనాథుని శరణు పొందుచున్నాను-

పరమాత్మయగు అమహేశ్వరుడేనాగనాథుడు - దేహము నందుగల నాడీసంచయమే నాగులు - ముఖ్యమగు నాడి వెన్నముకకు చివర (దక్షిణమున = నేర్పుగలప్రదేశమున) పాముచుట్టపలె నున్న కుండలినీ శక్తిని మేల్కొల్పి సహస్రార మున జేర్చు అనుభూతియే దివ్యానందము-

క్షేత్రకథ : భరతవర్ష దక్షిణాపథమున గోమతీద్వారకాసమీపమున నున్న దారుకావనమందిరమున ఆవిర్భావమందిన నాగేశ్వర జ్యోతిర్లింగము అత్యంత దర్శనీయము, పూజనీయము. ఆస్వామి దర్శనము పూజనము సకలార్ధ సిద్ధికరము: సకలపాపహరము, చిత్తనైర్మల్యము, భవవిమోచనము కల్గించునని పురాణవచనము.

ద్వారకసమీప సముద్రతీరమున క్రూరదానవదంపతులు దారుకుడు దారుక వసించుచు దేవతావర ప్రసాదమున మహాబలముగలవారై భక్తులగు ప్రజలను హింసించుచు దైవపూజలు వ్రతములు సాగకుండ చేయుచుండిరి. ఆతీరమందే ఒక సుందరవనమునిర్మించి అందువారు విలాసముగ జీవనము గడపుచు. బయటకు వచ్చినపుడెల్ల ప్రజలనేదోవిధమున పీడించుట వారికి పరిపాటి అయినది. ఆపరిసరములలో ఔర్వుడను ఒకమహాఋషి తపస్సొనర్చుచున్నాడు ఉండెను. దారుకుని బారినుండి తప్పించుకొనుటకు వేఱుదారిలేక ప్రజలెల్లరు ఔర్వుని కడకేగి మొఱపెట్టుకొనిరి - ఆఋషియు దారుకుని దారుణకృత్యములెఱిగి, అయసురుని పిలిపించి "నీవికముందు భూమిపై నివసించు అమాయకులు, నిరపరాధులు, భక్తులైన ప్రజలను హింసించుచో ఆక్షణమే మరణింతు"వని తీవ్రశాపమిచ్చెను. దారుకుడా శాపమునకుభయపడి సముద్రములోనున్న ఒకద్వీపమునకు తన వనమును మార్చి సముద్రనౌకలపై అటునిటు బోవు ప్రయాణికుల పట్టుకొని కొల్లగొట్టుచుండెను. ఒకనాడొక నౌకను ఆక్రూర దంపతులు బంధించి అందున్నవారిని పీడింపసాగిరి - ఆ నౌకయందున్న ప్రయా

ణికులలో సుప్రియుడను వైశ్యుడు శివభక్తుడొకడుండెను. దారుకాసురుడు పెట్టుబాధలకు లొంగక ఆవైశ్యుడు తానేకాక తనతోడివారిచే కూడ నిరంతర శివపంచాక్షరీ మంత్రజపము చేయించుచుండెను_సుప్రియుని వేఱువిధమున లోబరచుకొను విధములేక ఆతని వలన తక్కుప్రయాణికులును పాడగు చుండిరని తలచి, దారుకుడు సుప్రియుని వధించుటకై సాయుధులగు భటులనుబంపెను_ సుప్రియుడు మహాదేవునే తన శరణ్యునిగా భావించి" దేవదేవా, 'పరమశివా' భక్తప్రియా నీపాదభక్తులకిక బలవన్మరణము వచ్చినది గాబోలు. నీవేమి చేసినను సరే_అని తదేకధ్యానమున ఎల్గెత్తి మొఱపెట్టెను_తక్షణమే ఆదారుకావనము నందొక మందిరము అందొక జ్యోతిర్లింగము వెలసినది_సుప్రియుడా శివలింగము నాలింగన మొనరించి విడువక మునుపటివలె ప్రార్థించుచుండ పార్వతీ సహితుడై పరమశివుడు ప్రత్యక్షమై తన ఆయుధముతో దారుకుని పరివార సహితముగ వధించి సుప్రియాది భక్తులకెల్ల అభయ మొసగెను_

దారుకుని యనంతరము దానవి దారుకగూడ తిరిగి విజృంభించి ప్రజలను పీడింప మొదలిడగా శివభక్తుడగు వీరసేనుడను నృపతివచ్చి ఆ రక్కసిని చంపి దారుకావనమును నిష్కంటకము గావించెను.

దారుకావన మందిరమున వెలసిన నాగనాథ జ్యోతిర్లింగము భక్తులకెల్ల శరణ్యమై ఏవిధమగు బాధలు జనింపకుండ జేయుచు నిత్య పూజోత్సవములతో విరాజిల్లు చున్నది_

# వైద్యనాథంచితాభూమౌ

శ్లో॥ పూర్వోత్తరే ప్రజ్వలికానిధానే
సదావసంతం గిరిజాసమేతమ్
సురాసురారాధిత పాదపద్మమ్
శ్రీవైద్యనాథం తమహం నమామి॥

ఇలపై పుణ్యగయా ప్రదేశముల యందీశాన్య భాగానప్రజ్వలికా స్థానమునం దుమాసహితుడై శంభుండు శ్రీవైద్యనాథలసన్మూర్తి సురాసురార్చిత కనత్పాదాంబుజాతద్వయుండలరున్; శీర్షమువాల్చి వందనశతం బర్పింతు తత్స్వామికిన్

తాత్పర్యము : పుణ్యక్షేత్రమయిన గయకు ఈశాన్య భాగమున గల ప్రజ్వలికా స్థానమున సదా పార్వతీ సమేతుడై నివసించుచు దేవదానవు లిరువర్గములచేత పూజింపబడు పాదపద్మ శోభితుడు శ్రీ వైద్యనాథునికి వందనము లర్పించుచున్నాను.

విశేషార్థము : జోతిర్మయమైన అగ్నియే ప్రజ్వలిక. ఈశాన్యమున కధిపతి ఈశానుడు రుద్రుడు శివస్వరూపుడు-శిరస్సు ఉత్తరమని భ్రూమధ్యము ప్రాగ్దిశ అనియు వాని మధ్యగల ఆజ్ఞా చక్రము ఈశాన్యమనియు జీవునకు పరమాత్మ జ్ఞాన శక్తి మేల్కొనే ప్రదేశము అదే అనియు విజ్ఞుల అభివచనము.

క్షేత్రకథ : గయా క్షేత్రమునకు ఈశాన్యముననున్న చితాభూమిని వెలసిన మహేశ్వర జ్యోతిర్లింగమే వైద్యనాథ లింగము. శరణాగతులకు భక్తులకు సర్వార్థములిచ్చు ప్రభువు సమస్త మానసిక శారీరక వ్యాధులను నివారించు స్వామి

యగుటచే వైద్యనాథుడను నామమున ఆ మహాదేవుడు ప్రసిద్ధి గాంచెను.

లంకాధిపతియగు రావణుని తల్లి కైకసిగూడ శివభక్తురాలు. సముద్రతీరమున ఆమె ఇసుకతో లింగములుచేసి పూజించుచుండ సముద్ర తరంగములకవి కొట్టుకొని పోవుచుండెను. అహంకార దర్పుడు దశకంఠుడగు రావణుడు తాను శివునే లంకకు తీసికొని వచ్చెదనని తల్లికి చెప్పి కైలాసమున తపమారంభించి డాంబికముగా శివపూజ దీర్ఘకాలము జరిపెను గాని శివుడు ప్రత్యక్షము కాలేదు. ఇనుమడించిన దీక్షతో తుదకు తానే హోమగుండమున ఆహుతి యగుటకు సిద్ధపడి రావణుడు శివార్చనము మొదలిడి తన తలలను ఒక్కొకదానినే నరకి హోమగుండమున హవిసుగా ఇచ్చుచుండ పరమశివుడు ప్రత్యక్షమై వరము కోరుకొను మనగా రావణుడు "స్వామీ నీ వితఃపూర్వము ఎందరో భక్తుల ననుగ్రహించితివి. అట్లే నాపై కరుణజూపి నాతో లంకకువచ్చి వసింపుము. మేము నిన్ను నిత్యము పూజించుకొందు" మనగా పరమశివుడంగీకరించి తనకు మారు తన ఆత్మలింగము నిచ్చి "జాగ్రత సుమా దీనిని లంక చేగువరకు భూమిమీద పెట్టరాదు" అని భద్రత నుడివి అంతర్ధాను డయ్యెను.

తమ శత్రువైన రావణున కిట్టి భాగ్యమబ్బుటాయని దేవతలకిది కంటకింపుగా తోచి దీనికెట్లయిన అవరోధము కల్గింపుమని విఘ్నేశ్వరుని పంపిరి, రావణుడా లింగమును చేతియందుగైకొని చితాభూమి చేరుసరికి ఒక గోపబాలుని

రూపమున విఘ్నపతి యటనుండెను. ఏదో కాలకృత్యమునకు బయటకేగదలచి రావణుడాలింగము నచటి గోపబాలునికిచ్చి భూమిపై పెట్టవలదు జాగ్రతసుమా అని చెప్పి వెడలెను. ఆ లింగము గోపబాలుని చేతిలో అంతకంతకు చాల బరువై తుదకు భరింపలేనిదిగా ఉండుటచే రావణుని కొఱకు బిగ్గరగా అఱచి అఱచి ఎంతసేపటికి ఆతడు రాకపోవుటచే ఆ బాలుడా లింగ మును భూమిపై పెట్టెను. పెట్టుటే తడవుగ ఆ లింగమచట సుస్థిరముగా పాతుకొని పోయెను. రావణుడు వచ్చి ఎంత పెక లించినను భూమి అయిన కంపించినదిగాని ఆ లింగము కదల లేదు. హతాశుడై రావణుడు ఆ శివలింగమునకొక రత్నాంగు ళీయకము నివేదించి తన దారిని పోయెను.

అట్లు చితాభూమియందు ప్రజ్వలికా స్థానమున పాతు కొని పోయినదే మహేశ్వరుని వైద్యనాథ జ్యోతిర్లింగము. బ్రహ్మాది దేవతలు సయితము మరుదెంచి అచ్చట వెలసిన పరమ శివుని పలువిధముల స్తుతించి వెడలిరి. భక్తులెల్లరకు సర్వా భీష్టములిడు మహాప్రభువై వైద్యనాథేశ్వరుడచట నిత్యము పూజల గొనుచుండెను.

/=/

# సేతుబంధేచ రామేశం

శ్లో, సుతామ్రపర్ణీ జలరాశి యోగే
నిబద్ధ్య సేతుం విశిఖైరసంఖ్యైః
శ్రీరామ చంద్రేణ సమర్పితం తం
రామేశ్వరాఖ్యం నియతం నమామి.

జలధిన్ నిర్మల తామ్రపర్ణిజలముల్ సంయోగమౌ చోటునన్
బలితంపున్ బహుబాణసంతతులచే పాథోనిధిన్ సేతువున్
నిలుపంగల్గిన రామచంద్ర నృపుచే నిష్ఠన్ బ్రతిష్ఠార్చనా
దుల గైకొన్న శివున్ నమోనియతి గొల్తున్ రామలింగేశ్వరున్

తాత్పర్యము : శుభంకరములైన తామ్రపర్ణి నదీజలములు సముద్రమున కలియుచోట అంసఖ్యాకములైన బాణములతో సేతువును నిర్మించిన శ్రీరామచంద్రుడు ప్రతిష్ఠించిన రామ లింగేశ్వరునకు నియమ నిరతుడనై నమస్కారములర్పించు చున్నాను-

విశేషం : గమ్యస్థానము చేరుటకు త్రోవకడ్డువచ్చు అవరోధ ములు తొలగింపవలెను_ జీవాత్మకు పరమాత్మతో ఏకతఘటించు నియమ నిష్ఠలు కావలెను_ ఈ గమ్యస్థానము జేర్చు సాధనకు సంకేతము సేతువు- లంక అనే దేహమున దుష్టబుద్ధియగు రావణునిచే బంధింపబడిన జీవాత్మయే సీత. సీతారాముల కల యిక జీవాత్మ పరమాత్మల కలయిక-

క్షేత్రకథ : భరతవర్షము దక్షిణాగ్రసమీపమున సముద్రతటమున ధనుష్కోటి వద్ద తామ్రపర్ణిసాగర సంగమ స్థలమున శ్రీరాముని చే ప్రతిష్ఠింపబడి పూజలందుకొనుచున్న శివస్వరూపమే రామలింగేశ్వరుడు, ఆప్రదేశము రామేశ్వరమను పేరున మహా పుణ్యక్షేత్రమై విరాజిల్లుచు దర్శన మాత్రమున సర్వాభీష్టము లొసగుచున్నది. అచట నున్న నందీశ్వరుడు రజతరథము స్వర్ణగోపురము. రామతీర్థము హనుమత్కుండము మొదలగు నవి భక్తులకు దర్శనీయములు పూజనీయములు, గంగా జలము దెచ్చి రామేశ్వరములో శివలింగము నభిషేకించిన వారు జీవన్ముక్తులగుదురని పురాణవాక్యము. తామ్రపర్ణినదీ జలస్నానము శుభప్రదమనియు ప్రసిద్ధి.

రావణుడు పులస్త్య బ్రహ్మవంశజుడు. రావణవధానంత రము సీతాసమేతుడై శ్రీరాముడు తిరిగి ధనుష్కోటిని చేరెను రావణునిచంపిన బ్రహ్మహత్యా దోషము పోవుటకై మునుల ఆ దేశానుసారమచట శ్రీరాముడు శివలింగమును ప్రతిష్ఠించిపూజింప దలచెను. శ్రీరాముని ఆజ్ఞనుగొని హనుమంతుడొక శివలింగ మును తెచ్చుటకై కైలాసాచలమేగెను. అచట హను మంతున కొకింత ఆలస్యమై సుముహూర్తము సమీపించుటచే సీతాదేవి ఇసుకను ప్రోగుచేసి నిర్మించిన మహేశ్వరలింగ మును శాస్త్రోక్తవిధిగ శ్రీరాముడు ప్రతిష్ఠ జేసి పూజించెను.

హనుమంతుడింతలో శివలింగముతో వచ్చి తానొనర్చిన ఆలస్యమునకు "దేవా! రామచంద్రా నేను కొనివచ్చిన శివ లింగమేమికావలెను. అని చింతించుచు శ్రీరాముని కాళ్ళపై బడెను. శ్రీరాముడతని దైన్యమును జూచి "హనుమా! ముందు

ఇసుకతో బెట్టిన ఈశివలింగమును తీసివేయుము. ఆ నిర్ణీత స్థలములో నీవు తెచ్చిన లింగమును ప్రతిష్ఠ జేయవచ్చును నీకును తృప్తి కలుగును" అనగా, హనుమ సంతసించి ఆ యిసుక లింగమును కదల్పజూచి సర్వప్రయత్నము లొనరించి విఫలుడయ్యెను. శ్రీరాముడు హనుమని విచారము జూచి ఆతడు తెచ్చిన శివలింగమును కూడ సమీపమునందే వేఱొకచో బ్రతిష్ఠించి పూజించెను. హనుమ సంతోషభరితుడై ఆశివలింగమునకు తానును పూజలొనర్చి శ్రీరాముని కాళ్ళకు మ్రొక్కెను- ఆలింగములు రెండును ఒకటి రామేశ్వర లింగమును మఱియొకటి హనుమదీశ్వరముగా ప్రసిద్ధములై రామేశ్వరమున భక్తులపూజలందుకొనుచున్నవి - కాశియందు శ్రీవిశ్వేశ్వరుని పూజించినవారు అచటి గంగా జలమును తెచ్చి రామేశ్వరమున రామలింగేశ్వరుని కభిషేకించుట ఆచారము.

# ఘుశ్మేశంచ శివాలయే

శ్లో. ఇలాపురే రమ్య విశాలకేఽస్మిన్
సముల్లసంతంచ జగద్వరేణ్యమ్ ।
వందే మహోదారతర స్వభావం
ఘుశ్మేశ్వరాఖ్యం శరణం ప్రపద్యే ॥

శ్రీరమ్యమ్ము విశాల సుందరమునై చెల్వుల్ విడంబించు ఎల్లోరా యందవతార మందిన దయాళున్ భక్తపాలున్ మహోదార స్వాంతసుశీలు ఫాలతల నేత్ర జ్వాలునిన్ సర్వలోకారాధ్యున్ భజియింతు నాదుశరణై కాపాడ ఘుశ్మేశ్వరున్-

తాత్పర్యము : కడుమనోహరము. విశాలముపైన ఇలాపురము నందుల్లాసముతోవసించు జగత్పూజ్యుడు మహోదార దయా స్వభావుడునగు ఘుశ్మేశ్వరుని శరణుపొందుటకు నమస్కరించు చున్నాను-

నవద్వారపురము దేహము- అందు అంతర్యామిగా వెలుగుచున్న జ్యోతిపరమాత్మ - పరమాత్మతత్వము అతి విశాలమైనది-అయినను అతి సూక్ష్మమైన ఆత్మస్వరూపమా పర మాత్మ-ఆస్వామి తేజమే సర్వజగత్తు, ఆప్రభువు ఆకారణమున జగద్వరేణ్యుడు -ఇలాపుర వాసి అయిన ఘుశ్మేశ్వరుని పూజిం చుట ఆప్రభువు వద్ద శరణాగతి పొందుటయు దేహగతుడగు పర మాత్మ నన్వేషించుటయే.

క్షేత్రకథ : దక్షిణభారతమున ఉజ్జ్వల శిల్ప చిత్ర ప్రసిద్ధము లగు * ఎల్లోరాగుహలున్న ఇలాపురమున మహాదేవుడు ఘుశ్మేశ్వరలింగముగా సన్నిధి చేసి ఉన్నాడు తన భక్తులకు సత్‌శీలము సకల సౌభాగ్యములు ప్రసాదించి పునర్జన్మ లేకుండ చేయు ఉదారస్వభావుడా ప్రభువు- ఇచ్చటి శివాల యము శిల్పశోభితమై సుందరమై నయనానందకరముగ నుండును-

ఇలాపురప్రాంతమున దేవగిరి దుర్గము కలదు-అచట సద్గుణవంతుడు సదాచారసంపన్నుడు అయిన సుధర్ముడను విప్రుడు తన భార్య సుదేహతో నివసించుచుండెను- సంతానము లేని కొఱతమాత్రము వారిని బాధించుచుండెను- వారి యింటి కేతెంచిన సిద్ధులొకపరి సుధర్ముని హస్తముచూచి నీకు పుత్ర లాభము ఉన్నదని నుడివిరి -ఎంతకాలముచూచినను తనకు

సంతానము కలుగకపోవుటచే సుదేహ భర్త ఆలోచనకు తాను అంగీకరించి తన చెల్లెలు ఘుశ్మనాతనికిచ్చి పెండ్లి చెసెను- కాలక్రమమున ఘుశ్మ పుత్రసంతానము కలిగి భర్తతో సంతోషముగ కాలము గడవుచుండెను- ఘుశ్మ శివ భక్తురాలు. ఉషఃకాలముననే లేచి కాలకృత్యములు తీర్చికొని అచట నున్న తటాకమున స్నానమొనరించి శివలింగములకు అభిషేకము, పూజ చేసికొనిగాని ఆమె తక్కిన పనులకు పోదు- భర్తతోపాటు అక్కగారిని కూడ భక్తిశ్రద్ధలతో ఘుశ్మ చూచు చుండెను-

కుమారునితో సంతోషముగ కాలము గడపుచున్న ఘుశ్మను చూచి అంతకంతకు సుదేహ ఈర్ష్య ద్వేషము పెంచు కొని ఒకనాటి రాత్రి ఎవరికి తెలియకుండ నిద్రపోవుచున్న ఘుశ్మకుమారుని గొంతుపిసికి చంపి సమీప తటాకములో పారవేసెను-ఘుశ్మయింకను తన ప్రాతఃకాల పూజలోనున్నది- ఆ భక్తి పారవశ్యములో కుమారుని మాటయే యామె తల పులో లేదు- సుదేహ ఏమియు ఎఱుగనట్టు పరుగు పరుగున వచ్చి ఓఘుశ్మా! నీకుమారుని ఎక్కడకుపంపితివి. కనపడడే అని ఆతురత నటించుచు అడుగదొడగెను. ఘుశ్మ తన పూజను ముగించుకొని అభిషేకమొనరించిన శివలింగములను కనుల కద్దుకొని సరోవరములో కలుపుటకు వచ్చుచుండగా, అమ్మా! అమ్మా! అనిపిలుచుచు ఆబాలుడు జలముల నీదుకొనుచు ఒడ్డు నకు వచ్చెను. తనబాలు నచ్చుటచూచి ఘుశ్మ అశ్చర్య పడు చున్నది- ఆకుమారునకంతయు పీడకలగా తోచినది-

నిష్కల్మషహృదయ నిశ్చల శివభక్తి పరురాలు అయిన ఘుశ్మను అనుగ్రహింపదలచి పరమశివుడే ఆ బాలునట్లు బ్రతికించి ప్రసన్నుడై ఘుశ్మ యెదుట ప్రత్యక్షమయి జరిగిన కథనుచెప్పి సుదేహను శిక్షింపదలచెను- ఘుశ్మ కనులనీరు పెట్టుకొని పరమశివుని పాదములపైబడి "మహేశ్వరా దేవదేవా, సుదేహ నాకు పతిభిక్ష సుతభిక్ష పెట్టినది, ఆమె సౌఖ్యము కొంత త్యాగముచేసి కొని ఈయుపకారమామె చేసినందులకు ఆమెలో నున్న ఈర్ష్యను ద్వేషమును నావిన్నపమాలించి నశింప జేయు మిదిచాలును. నాకు ప్రత్యక్షమై కరుణాప్రసన్నమైన నీస్వరూపమును నేనిచట నిత్యము చూచి పూజింపగోరెదను. అని ప్రార్థింపగా ఆమహేశ్వరుడు ఘుశ్మేశ్వర నామముతో జ్యోతిర్లింగముగా అచటనే వెలసెను. భక్తపాలకుడై ఆ మహాదేవుడు భక్తులెల్లరకు ఇహపరసౌఖ్యము లొసగుచు మంచి చెడ్డల నెఱుగు సత్ శీలమును ప్రసాదించుచున్నాడు.



# ఫలశ్రుతి

శ్లో. జ్యోతిర్మయ ద్వాదశలింగకానాం
శివాత్మనాం ప్రోక్తమిదం వరేణ
స్తోత్రం పఠిత్వా మనుజోఽతిభక్త్యా
ఫలంతదాలోకనజం భజేచ్ఛ

ఇది, పండ్రెండు శివాత్మకోర్జిత ఫల మ్మొపారు జ్యోతిఃకళా స్పదలింగమ్ముల గూర్చిఁ శంకరకృతంబౌస్తోత్రమెవ్వండు తా నెద భక్తిన్ బఠియించు నాతనికి ప్రాప్తించున్ తదాలోకన ప్రద భాగ్యమ్ములు ధారుణిన్, తుదకు శశ్వన్మోక్ష సంపన్నిధుల్

తాత్పర్యము : ఇది జగద్గురువులు పరివ్రాజక వరేణ్యులు శ్రీశంకరాచార్యుల వారు వ్రాసిన శివాత్మకములైన పండ్రెండు జ్యోతిర్లింగముల స్తోత్రము. భక్తిశ్రద్ధలతో దీనిని పఠించు మనుజునకు ఆద్వాదశ జ్యోతిర్లింగ దర్శన ఫలము లభించును.

స్తోత్రములకు పురాణ కథలకును తుదను ఫలశ్రుతి చెప్పుచుందురు ఈ శ్లోకము అట్టిదియే భక్తునకు వలసిన ముఖ్య లక్షణములు నిశ్చలము నిర్మలము అయిన భక్తిశ్రద్ధలు—ఆ పరమేశ్వరుడు తన భక్తునికి సర్వశ్రేయములు ప్రసాదింప గల దయాళువు, సమర్థుడు – స్తోత్రపఠన ప్రయోజనముగా తాను భజించు పరమాత్మను భక్తుడు సర్వాంతర్యామిగా తెలిసి కొనగల స్థితికి రావలెను.

294:533
SOB
Acc no. 2166



క్షేత్రదర్శనము, దైవదర్శనము ఆధ్యాత్మిక సాధకునకు ఆవశ్యకములగు సత్కర్మములు- తీర్థక్షేత్రములు పరమాత్మ స్వరూపములు వెలసిన పవిత్రస్థానములు _ మహాత్ముల చేతను కొందఱు దేవతలచే సైతము పవిత్ర మంత్ర బీజాక్షరములచే లోకకళ్యాణార్థము ప్రతిష్ఠింపబడిన దైవరూపములవి. భగవానుడు సన్నిధి చేసిన స్థలములు మహాత్ములు సంచరించిన పుణ్య ప్రదేశములు తీర్థములు క్షేత్రములు. ఆ తీర్థ క్షేత్రదర్శనము_మనుజునకు దైవభక్తి పెంపొందించు సచ్చరిత్రునిగా చేయగలవియేకాక, సర్వజనులయెడల సమత్వ దృష్టి నలవడ జేయుశక్తిగలిగి, తనలో ఉన్న పరమాత్మను అందరిలోను అంతర్యామిగా ఉన్న సత్యమును మనుజులకు తెలియజేయు సమర్థములు.

ఈ ప్రభావముల వలన మనుజుని హృదయము, భావన, ప్రవర్తన, క్రమముగ పరిపక్వమయి, ఇంద్రియనిగ్రహము సాత్వికవృత్తి అలవడి జన్మకు సార్థకత గూర్చును_తనను తానుద్ధరించుకొని సమాజమునకు తోడ్పడుటకు ఇట్టి ఆధ్యాత్మిక సాధనయే అత్యుత్తమ మార్గము_

ఈ ద్వాదశజ్యోతిర్లింగమహిమలను చాటు క్షేత్రకథలు ఎల్లరకును మార్గదర్శకములైన నిదర్శనములు సాయంప్రాతర్వేళలలో ఈ స్తోత్రములను పఠించువారికి తథ్యముగ పరమశివుని అనుగ్రహమున ఇహ పరలోకానందసౌఖ్యములు కలుగగలవు_

/=/

శ్రీ ప్రసన్న భారతీ గ్రంథమాల –

(శ్రీ) కొండేపూడి సుబ్బారావుగారి - ఉత్తమ సాహిత్య గ్రంథములు –

| నెం. | పుస్తకము పేరు – | వివరములు. | ప్రతికి వెల రు.లు. |
|---|---|---|---|
| 1. | గీతామృతము :– 1993 ప్రచురణ | భగవద్గీత 18 అధ్యాయములు మూలం పద్యతాత్పర్య సహితము | 30 = 00 |
| 2. | పరమేశ్వరి. వచనము. | (శ్రీ) దేవీ భాగవతమునకు సంక్షిప్త రూపము | 20 = 00 |
| 3. | విజయగీత వచనము. | (శ్రీ) భగవద్గీత ననుసరించి వ్రాసిన పౌరాణిక నవల. | 20 = 00 |
| 4. | ప్రసన్న భారతి- కవితాసంకలనము- | ఈనాటి దాదాపు 170 మంది సుప్రసిద్ధకవుల సరస్వతీస్తుతి 1,2 భాగములు- | 25 = 00 |
| 5. | సౌందర్య లహరి | మూలము – తెలుగు పద్యతాత్పర్య సహితము | 15 = 00 |
| 6. | శివానందలహరి | do | 10 = 00 |
| 7. | ముకుందమాల. | do | 6 = 00 |
| 8. | ఈశ్వరార్పణము- | శతకము– | 8 = 00 |
| 9. | హనుమత్ స్తోత్రము– | శతకము– | 4 = 00 |
| 10. | దేవీపంచాశిక– | దేవీ, లక్ష్మి, పార్వతి, సరస్వతుల స్తుతి పద్యములు- | 3 = 00 |
| 11. | ప్రార్థన దండకములు- | వినాయకుడు మొదలు హనుమంతుని వరకు - 12 | 3 = 00 |
| 12. | శ్రీ సరస్వతీదేవి మహాత్మ్యము | వచనము. | 3 = 00 |

ప్రతులకు – గ్రంథకర్తకు వ్రాయవలెను –

చిరునామా. 47–10–5. ద్వారకానగరము విశాఖపట్నం 16